# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర వైశాఖ బ॥ ౨
గురువారము


# క్రొత్త బ్రిటిషు మంత్రివర్గము— భారతీయాశయము

చేంబర్లేనుగారి స్థానమున బ్రిటిషు ప్రధానిగ చర్చిల్‌గారు వచ్చుట వలన ఇకమీఁద భారత దేశ సమస్య సంశయస్థితిలోనుండక త్వరలో ఏదో ఒకతీరున నిశ్చితము గున ని డాక్టరు పట్టాభి సీతారామయ్య గారు చెప్పిరి. చర్చిలుగారు ఏ సమస్యనుగాని విశేషకాలము ఆపియుంచక త్వరలో తేల్చెడి గుణముగలవారు. భారత దేశమునకు స్వాతంత్ర్యము నీయవలెనను సమస్య అటోఇటో త్వరగా తేలవచ్చును. కాని అనుకూలముగా తేలునా తేలదా అనునదియే ప్రశ్న, అనగా వెంటనే కాంగ్రెసువారు కోరు భారతీయాశయములను ఇచ్చివేసెదరా లేదా? ఈ విషయమున క్రొత్త బ్రిటిషు మంత్రివర్గము యొక్క అనుకూల ప్రతికూలతలు ఎంతవరకుండును?

క్రొత్త యుద్ధ మంత్రివర్గము ందు బ్రిటిషు లేబరుపార్టీ ముఖ్యులగు అట్లీగారు ఒక మంత్రిగానున్నారు. వీరిప్రధానకర్తవ్యము యుద్ధమునందు బ్రిటిషువారికి జయము కలుగునట్లు పనిచేయుటయే అయినను, వీరికి భారత దేశస్వాతంత్ర్యాశయమందు చిరకాలముగా అభిమానమున్నట్లు వ్యక్తపరుపబడి యుండుటచేతను, భారతదేశమునందు అన్ని పక్షములవారును ప్రస్తుత యుద్ధమునందు బ్రిటిషువారికి వస్తు మనుష్యసహాయమునకేగాక, నైతికముగగూడ సహాయమగుటవలన బ్రిటిషువారి బలము మరింత హెచ్చును గనుకను అట్లీగారు భారతదేశాశయమును తీర్చుటకై అధికారస్థానములోనుండి తానేమైన సహాయము చేయుటకు వీలున్నచో, దానికి ఇప్పుడే తగిన అవకాశము.

ఇప్పుడు భారత దేశమునకు సెక్రిటరీ ఆఫ్‌స్టేట్‌గా బ్రిటిషు మంత్రివర్గమందు ఉన్నమంత్రి యల్, యస్. అమెరీగారు. వీరు భారతదేశములో జన్మించినవారు. సంయుక్తరాష్ట్రమందు ఇదివరలో గోరఖ్పూరునందు అటవీశాఖ ఉద్యోగిగనుండిన చార్లెస అమెరీ గారి కుమారుడు. వీరు కన్సర్వేటివు పక్షమువారే. అనగా భారత దేశమునకు స్వరాజ్యమును ఎంతమాత్రము ఇవ్వరాదు అని తలచెడి పక్షములో సభ్యులు కాని ఇదివరలో భారత రాజ్యాంగశాసనమునుగూర్చి పార్లమెంటులో చర్చసాగుచుండి నపుడు వీరు భారత దేశమునకు వెంటనే సంపూర్ణస్వాతంత్ర్య మిచ్చుటకు తగిన అర్హతలేకున్నను, "ఎల్లకాలము మీరు పరాధీన స్థితిలో నుండవలెనని మనము భారతీయులతో ఎటుల చెప్పగలము" అనుచు, చర్చిల్‌గారితో ఏకీభవించ జాలమనిరి. అనగా భారత దేశ స్వాతంత్ర్యవిషయమున వీరు అసలే దానినొసగరాదను వారుకారని స్పష్టమైనది.

అమెరీగారు క్రొత్త ఉద్యోగమును స్వీకరించిన తర్వాత మొట్టమొదటి సారిగా మే ౧౭వ తేదినాడు లండనులోనున్న అన్నిరకాల భారత దేశంలోని పత్రికల ప్రతినిధులకు దర్శనమిచ్చి సంభాషించుచు, భారతదేశము తమ జన్మస్థలమనియు, ఆదేశము యెడ తమకు సహజమైన అభిమానముగల దనియు చెప్పిరి. తన అనుభవమంతయు తనకు స్వపరిపాలన సిద్ధాంతమునందు విశ్వాసము దృఢముచేసినదని చెప్పిరి. భారత దేశ రాజ్యాంగాభివృద్ధి సమస్యను చర్చించుటలోగల చిక్కులు తానెరుగుదు ననియు, వెంటనే ఆ విషయమై ఎట్టిఅభిప్రాయముగాని చెప్పజాలననియు, కాని నిష్పక్షపాతమైన మనస్సుతో స్వతంత్రముగ ఆచిక్కులను గురించి ఆలోచించెదమనియు అమెరీగారు చెప్పిరి,

స్వపరిపాలన సిద్ధాంతమునందు దృఢవిశ్వాసముంచి, నిష్పక్షపాత దృష్టితో భారతదేశ రాజ్యాంగాభివృద్ధి విషయమును క్రొత్త సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గారు పరిశీలించి, ఆ విధాన తేలెడి నిర్ణయమును నిలుపుచో భారత దేశ భవిష్యత్తును గూర్చి నిరాశజెంద నవసరమే ఉండదు.

---

## ఆంధ్రియువతీమండలి సంతాపసభ

శ్రీమహారాజా బహద్దరువారి మరణమునకు విషాదమును వెల్లడించుటకు ఆదివారం ౧౯-౫-౪౦ నాడు మండలి భవనమున సభజరిగెను. శ్రీమతి రంగమ్మరెడ్డిగారు అధ్యక్షతవహించి మహారాజా బహద్దరువారి జీవితమును వారి దానధర్మములనుగురించి ఉపన్యసించిరి. తరువాత ఈక్రింది తీర్మానము సీతాకుమారి గారిచేత ఉపపాదింపబడిటి. వరలక్ష్మమ్మగారిచేత బలపరుపబడెను,

"మనరాష్ట్రము దాదాపు ౨౫సంవత్సరములు ప్రధానామాత్యులుగానున్నవారును తమ అవిరళ దానధారలచే ననేకసంఘములకు కోట్లకొలది బీదలకు ఆశ్రయమైనవారును విఖ్యాతిక ళాపోషకులును అగు శ్రీశ్రీ మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దరు యామీనస్ సల్తనతువారి మరణమునకు మాదుర్భరవిషాదమును వెల్లడించుచు వారియాత్మకు శాంతికలుగుగాకయని కోరుచున్నాము.

సభ్యులందరును లేచి అంగీకరించిరి.

---

## సంస్థానాల ముస్లింలీగు

హైదరాబాదు (దక్కన్), తీరుగ౩
అఖిలభారత సంస్థానాల ముస్లింలీగు మహాసభ అధ్యక్షులగు నవాబు బహదర్‌యార్ జంగు బహదర్‌గారు ఆమహాసభయొక్క స్థాయిసంఘమునందు హైదరాబాదు ప్రతినిధులుగ గాజీ అబ్దుల్‌హసన్ సయ్యదలీ, మహమ్మద్ అబ్దుల్ రవూఫ్ గారలను నియమించినారు.

---

## సికింద్రాబాదు ఆర్య సమాజ వార్షికోత్సవము

సికింద్రాబాదు ఆర్యసమాజముయొక్క ౪౨వ వార్షికోత్సవము ౨వ రోజు ఉదయము భజనలు ప్రార్థనలు, హవనముతో ప్రారంభమయ్యెను. పిమ్మట పండిత గంగాప్రసాదు ఉపాధ్యాయ, యం. ఏ. గారు గాయత్రీమంత్రమునుగూర్చి ఉపన్యసించిరి.

సాయంకాలము గంగాప్రసాదు ఉపాధ్యాయగారు జీవాత్మయొక్క ఆధ్యాత్మికార్థమునుగురించి ఉపన్యసించిరి. రాజగురు ధురేంద్రశాస్త్రిగారు ఆధ్యాత్మిక సాధనమునుగురించి ఉపన్యసించిరి.

మూడవరోజు

మూడవరోజు బాల్యవివాహ నిషేధశాసనమునుగూర్చి చర్చజరిగెను. ఆశాసనమును సికింద్రాబాదు ఆర్యసమాజమువారును ఆస్థలములోచేరియుండిన ఇతరులును సుమారు ౬౦౦మంది ఆమోదించుచున్నారను తీర్మానమును శ్రీయుత బాజీ కృష్ణారావు, బి. ఏ. బి, ఎల్ గారు ప్రతిపాదించిరి, పండిత గంగాప్రసాదు ఉపాధ్యాయులవారు దానిని బలపరచిరి. పిమ్మట తీర్మానము ఏకగ్రీవముగ ఆమోదించబడెను. పిమ్మట పండిత రాజగురు ధురేంద్రశాస్త్రిగారి విజ్ఞప్తిపై సికింద్రాబాదు ఆర్యసమాజమందిర నిర్మాణమునకు విరాళములు వసూలుచేయబడెను.

---

## ప్రధానమంత్రిగారి పర్యటనము

హైదరాబాదు, మే ౧౯
రైటు ఆనరబుల్ సర్ అక్బర్ హైదరీ ప్రధానమంత్రిగారు ఈసంవత్సరపు వర్షాకాలములో బరాడుకుపోయి అక్కడినుండి బుర్హానుపూరుకు పోవగలరనియు అక్కడ మొదటి అసఫ్‌జాగారి సమాధికి జ్యారత్ చేయగలరనియు సంగతి తెలియుచున్నది.

---

## బొంబాయి-కలకత్తా

౯ గం॥ లో విమాన ప్రయాణం

బొంబాయి —
బొంబాయినుంచి కలకత్తాకు ౯ ౧/౪ గంటలలో మధ్య ఎక్కడా దిగకుండా విమానం ద్వారా ప్రయాణముచేయుటానికి వీలుపడునట్లుగా టాటాకంపెనీవారొక క్రొత్తస్కీమును తయారుచేసి ప్రభుత్వంవారికి సమర్పించబోతున్నారు, ఈవిమానానికి ఇంజనులు ఒక్కటికంటె ఎక్కువగావుండును రాత్రిపూటనే ప్రయాణంచేయడానికి ఏర్పాటుచేసినారు. అందుచేత ప్రయాణీకులు పడుకొని నిద్రపోవటానికి సౌకర్యాలు అమర్చబడినవి. విమానాలు గంటకు ఎంత స్పీడుగా పోతు... తో పోవును. అటునుంచి వచ్చేదిగాని. ఇటునుంచి వెళ్లేదిగాని విమానాలు ప్రయాణీకులకు ఇబ్బంది లేకుండా సకాలంలో ఉదయం పూట నడిచేటట్టుగా ఏర్పాటుచేయబడును.

---

## రైలు ఇంజనుల నిర్మాణం

కాంచ్రపారా కార్యాలయములో జరుగును

సిమ్లా, మే౧౯:—
మూడు రైల్వేలయొక్క ప్రధాన ఇంజనీయర్లున్నూ, రైల్వేబోర్డు ప్రతినిధులున్నూ ఈమధ్య ను సమావేశమై చేసినచర్చల ఫలితంగా బ్రాడ్‌గేజ రైల్వేఇంజనులు తయారు చేయుటకు గాను కలకత్తాకు ౨౫మైళ్ళలోవుండే కాంచపారా వర్కుసాపులో యంత్రములు వగైరా నెలకొల్పుటకు నిర్ణయంజరిగింది. జి. హంఫ్రీసు, కె.సి. శ్రీనివాసన్ గార్లతో యేర్పడిన నిపుణుల సంఘము యొక్క శిఫార్సులననుసరించి ఈనిర్ణయం చేయబడ్డది. కాంచపారాలో ఇదివరకుండిన మరమ్మతులుచేసే యంత్రాలు ఎక్కడికి మార్చేది తేలలేదు.

సంవత్సరానికి నూరుఇంజనులు తయారు చేయుటకిప్పుడు ప్రణాళికను సిద్ధం చేస్తున్నారు. సాధారణంగా ఇండియాకు ఏడాదికి నూరుఇంజనులు కావలసివచ్చును. యంత్రములువగైరా నెలకొల్పుటకు రెండుసంవత్సరాలు పట్టును. యుద్ధం వల్ల ఈ యంత్రసామగ్రిని యూరపునుంచి తెప్పించుటకు చిక్కులేర్పడినవి. డాలరు మారకం ధర హెచ్చుగుటచేత అమెరికానుంచి తెప్పించుటకూడా లాభముకాదు. అందుచేత బ్రిటిషు యంత్రసామగ్రి బహుశా తెప్పించబడుతుంది.

జూన్ నెలాఖరులో సిమ్లాలోజరిగే రైల్వేల ఆర్థిక స్థాయిసంఘంవారి సమక్షంలో స్కీము ప్రాప్తిగా చర్చింపబడును. అది సాధ్యం కాకపోతే అనంతరమైనా ఇందుకోసం ప్రత్యేకసమావేశం జరుగుతుంది.

---

## రాజకోట సంస్కరణలు

ప్రజాప్రతినిధిసంస్థలు స్థాపింపబడును

ఠాకూరు సాహేబు ప్రకటన

రాజకోట,మే౧౯—
రాజకోట సంస్థానాధిపతి ఠాకూరుసాహేబుగారి చేవ్రాలుతో నీక్రింది ప్రకటన వెలువడినది. అందిట్లున్నది:—బ్రిటిషుప్రభుత్వానికీ సంస్థానికీ వుండే పరస్పరసంబంధానికిగాని, సంస్థానములో సంస్థానప్రభుత్వము యొక్క అధికారానికిగాని ఏవిధమైనభంగము లేకుండ సంస్థానములో వివిధసంఘములవారి న్యాయమైన హక్కులకు భంగము లేకుండ, ప్రజాప్రతినిధిసంస్థలను బాధ్యతాయుతసంస్థలను అభివృద్ధిపరచుటద్వారా ప్రబల రాజకీయాభివృద్ధిని సాధించడం మాతండ్రిగారైన శ్రీలఖాజీరాజ్‌గారి సంకల్పమైయుండెను. ఆసంకల్పంతో వారుప్రజాప్రతినిధిసభను మ్యునిసిపాలిటీని నెలకొల్పిరి. గతసంవత్సరం దురదృష్టవశాత్తు ప్రజలకు సంస్థానాధిపతికి కలిగిన మనస్తాపంచేత ప్రజాప్రతినిధి సంస్థలు యథాపూర్వము తాత్కాలికంగా రద్దుచేయబడి నిర్బంధశాసనాలు అమలు జరుపబడవలసివచ్చెను"పలుమారు ప్రజలు కోరినప్రకారం తండ్రిగారి సంకల్పాన్నొప్పున ప్రజలకు మరల ప్రజాప్రతినిధి సంస్థలను ప్రసాదించడానికి ఠాకూరు సాహేబుగారు మతమదివాను గారికనుమతినొసంగుచు ప్రకటించిరి.

---

## దేశీయచక్కెర ఎగుమతికి క్రొత్త అవకాశము

బ్రిటిషు ప్రభుత్వమువకు ఇండియాప్రభుత్వ విజ్ఞప్తి

సిమ్లా, మే ౧౩
వెస్టుఇండీసులో చెఱకు ఈతేప సరిగాపండనట్లు వృల్లన్ ప్రభువుగారు నిన్న అంచెనుండి రేడియోలో చెప్పిరి. అక్కడనుండి చక్కెర ఎక్కువగా లభించదు. కనుక బ్రిటిషుప్రభుత్వం వారు ఇండియానుండి చక్కెర కొనవలసినదని ఇండియాప్రభుత్వంవారు విజ్ఞప్తిచేసిరి. చౌకధరలకు దేశీయచక్కెర సప్లయిచేయవచ్చునని కూడ ఎరిగించిరి. ఇండియాలో అమ్ముడు కాకుండా మిగిలిపోయినచక్కెరకు ఈవిధముగా విక్రయావకాశము యేర్పడవచ్చును.

---

## శంకరప్రసాదుగారికి ఉపకారవేతనము

ఇంతకుపూర్వము నవరుమహాసబు గానుండిన శంకరప్రసాదు బి. ఏ. గారికి ... ఉపకారవేతనము ప్రధానమంత్రి ఆజ్ఞానుసారము ప్రసాదింపబడినది.

---

## మహారాజా సర్ కిషన్ ప్రసాదుగారి దేవిడీలు సురక్షితముగా నున్నది

హైదరాబాదు తీరు ౧౫
శ్రీ. శ్రీ. మహారాజా గారి దేవిడీలు కొలిక సురక్షితముగాయున్నది. ప్రస్తుతమిది వారి ఆస్తుల కోశాధికారి భద్రపరచి యుంచఁబడియున్నది. ... బిడ్డల ... వారి ... పరీక్షించ నిలిచెను.

---

## నిజాంరాష్ట్రి మేరుసంఘ ఆరవ వార్షికోత్సవము

విక్రమనామసం॥ర వైశాఖ బ॥౫ (మే ౨౬ ౧౯౪౦) ఆదివారము సాయంత్రము ౪ ఘంటలనుండి రెడ్డిహాస్టలుహాలులో మేరుకులవాయకులైన (సర్ చౌద్రి) శ్రీయుత శాస్త్రి ఆనేవయ్యగారి అధ్యక్షతక్రింద ఈవార్షికోత్సవము జరుపబడును. ఇట్టి శుభఅవసరమున స్వకులమహాశయులు అఖిలభారత మేరుసంఘాధ్యక్షులైన శ్రీయుత మల్లెల శోభనాచలపతిరావు కవిరాజవైద్య విద్వాన్ యం. బి, హెచ్, అండు విశాఖపట్నం-బి- (బెజవాడ గార్లు) మేరుకులసంఘ నాయకులైన శ్రీయుత కొటారము ... గారు, ... సంఘ సదర్ పంచాయతీ కార్యకర్తలగు శ్రీయుత ... గారు మొదలగువారు ఉపన్యసించెదరు.

---

# హైద్రాబాదు బజారు ధరలు

తేది ౧౩-౫-౪౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లకూరకము, ధరలన్నీ హాలీవి.

| బియ్యము | పల్లా ౧కి ధర రూ | అ | పై |
|---|---|---|---|
| కిచిడీసాంబర్లు | ౨౧ | నుంచి | |
| | ౨౨ | ౫ | వరకు |
| సంబర్లు | ౨౨ | ౫ | ౦ |
| ఢిల్లీభోగాలు | ౨౦ | ౦ | ౦ |
| రాంసాగర్లు | ౧౫ | ౫ | ౦ |
| నానక్రాం | ౨౧ | ౦ | ౦ |
| ఆర్కాటి | ౧౯ | ౫ | ౦ |
| కోనామణి | ౧౫ | ౫ | ౦ |
| బుడుములు | ౧౩ | ౫ | ౦ |
| దేవాకరి | ౧౩ | ౪ | ౦ |
| గోధుములు | | | |
| బన్సి | ౧౫ | ౧౨ | ౦ |
| లష్కరీ | ౧౫ | ౦ | ౦ |
| పోటియా | ౧౩ | ౫ | ౦ |
| ఎర్రగోధుములు | ౧౬ | ౦ | ౦ |
| జొన్నలు | | | |
| తెల్లజొన్నలు | ౧౦ | ౧౨ | ౦ |
| పచ్చజొన్నలు | ౯ | ౫ | ౦ |
| మడికట్టుజొన్నలు | ౯ | ౦ | ౦ |
| సెనగలు | ౧౪ | ౨ | ౦ |
| కందులు | ౧౦-౧౨-౦ నుంచి | | |
| | ౧౨-౧౨-౦ వరకు | | |
| మినుములు | ౧౭ | ౧౨ | ౦ |
| లంకలు | ౧౨ | ౧౨ | ౦ |
| సజ్జలు | ౧౦ | ౫ | ౦ |
| కుసుములు | ౯ | ౪ | ౦ |
| పప్పు | | | |
| సెనగపప్పు | ౧౫ | ౪ | ౦ |
| కంది ,, | ౧౭ | ౫ | ౦ |
| సిరిసెనగ ,, | ౨౩ | ౦ | ౦ |
| లంక ,, | ౧౬ | ౪ | ౦ |
| మినప ,, | ౨౪ | ౫ | ౦ |
| పెసర ,, | ౨౨ నుంచి | | |
| | ౨౪ వరకు | | |
| బెల్లము | ౧౬ | ౫ | ౦ |
| ఉప్పు | ౧౩ | ౦ | ౦ |
| ఉల్లిగడ్డ | ౨ | ౦ | ౦ |
| మినపవరుగు | ౨౬ నుంచి ౩౦ వరకు | | |
| చక్కెర మణుగు (౪౦ సే) | | | |
| జావా ,, ,, | ౧౬ | ౧౦ | ౦ |
| బొంబాయి ,, ,, | ౧౬ | ౩ | ౦ |
| మద్రాసు ,, ,, | ౧౬ | ౪ | ౦ |
| నిజామాబాదు ,, ,, | ౧౬ | ౪ | ౦ |
| ఎర్రచక్కెర ,,(౧౨సే) | ౩ | ౦ | ౦ |
| దర్గాచక్కెర ,,(౪౦ సే) | ౧౭ | ౫ | ౦ |
| ఎల్లిగడ్డ ,,౧౨సే | ౨ | ౧౦ | ౦ |
| అల్లం ,, ,, | ౨ | ౧౨ | ౦ |
| నూనె మణుగు ౧౨ సే | | | |
| కొబ్బెరినూనె | ౪ | ౧౪ | ౦ |
| కుసుమనూనె ,, | ౩ | ౧౪ | ౦ |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ |
| వేరుసెనగనూనె ,, | ౩ | ౫ | ౦ |
| పుంటినూనె ,, | | | |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧ కి | | | |
| తెల్లది ,, | ౪ | ౩ | ౦ |
| పచ్చది ,, | ౩ | ౯ | ౦ |
| నెయ్యి మణుగు ౪౦ సే | | | |
| వివరనెయ్యి ,, ,, | ౪౬ | ౦ | ౦ |
| తెలంగాణా ,, ,, | ౪౦ | ౦ | ౦ |
| వనస్పతి డబ్బా ౧ కి | ౧౧ | ౨ | ౦ |
| బంగారు తు ౧ కి | ౬౪ | ౫ | ౦ |
| వెండి ౧౦౦ తు | ౩౩ | ౪ | ౦ |
| తు ౧ కి | ౦ | ౧౦ | ౯ |
| సవరన్ ౧ కి కల్దారు రూ | ౨౫ | ౪ | ౦ |
| మారకం | | | |
| హాలీకి కల్దారు | ౧౭ | ౧౧ | ౦ |
| కల్దారుకు హాలీలు | ౧౭ | ౯ | ౦ |
| ఆముదాలు బస్తా | ౧౪ | ౦ | ౦ |
| వేరుసెనగ | | | |
| బుడ్డలు మణుగు | | | |
| పప్పు పల్లాకి | ౧౬ | ౫ | ౦ |

గమనిక:—

౧. ధరలు నిర్దిష్టమైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైనపొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు.

౨. నగరాలలో జిల్లాలలో వ్యాపారపు పేటలలోని గొప్పవర్తకులు ఆయాకాలములలో ప్రకటనలు మా పత్రికలో వేసికొనిన వారి వ్యాపారానికి ఎంతో ప్రయోజనము కలుగును.

## స్త్రీహత్యకై అరెస్టులు

ఖుర్దాదు నెల ఆఖరులో మహబూబునగరం రైల్వేస్టేషనువద్ద ఒక మురుగుకాల్వలో పడియుండిన స్త్రీశవము విషయములో ఒక పోలీసుకానిస్టేబిలు, ఒక కోమటివాడు అరెస్టుచేయబడిరి ఇంకను వారివిచారణ జరుగుచున్నది.

## గంగాపురం జాతర భీభత్స

యజమానురాలితో వైశ్యకులతగవు

(స్వవి.) మహబూబునగరం, తీరు ౧౧

"గోలకొండ" పత్రిక మునుపటి సంచికలో "గంగాపురంజాతర" యను శీర్షికపై జాతర రథ తీరునుండి జరుగగలదని ఎవరో ఊరుపేరు లేనివారు ప్రకటింపించిరి కాని శ్రీ చెన్నకేశవస్వామి కల్యాణోత్సవముమాత్రము గుడ్డిముగ్గురిచే జరుపబడెను. వీనిలో గ్రామాధికారులను వ్యాపారస్థులు ఎవ్వరునులేరు. కారణము విచారింప పూజారిని పోలీసుపటేలును పూర్వవిధిగా పనుకపంపిపిలువలేదట. కావున రాలేదు. వైశ్యుల ఇంటి ఏదుట శ్రీవారిసేవ నిలుపుటలేదట. వారు దేవాలయమునకు రానిరాకరించిరి, గ్రామాధికారులు తదితరులు ఒకరిలోఒకరు కక్షబూని శ్రీవారి ఉత్సవము జరుపకుండుటయేకాక దేవాలయము నకు రామనుకున్నారు,

రథోత్సవముజాడ, రాజాపురం, కొత్తపేట, పాలమూరు తదితరపరిసర గ్రామములనుండి ఎంతమోజనము, ఎన్నియోపాట్లను లోబడి రాత్రి వేళకువచ్చెను. ఆజనము రాత్రంతయు ఉపోషముండి తినుబండారమైనకొని పొట్ట నింపుకుందామని ప్రయత్నించినను ఒక్క దుకాణముకూడా లేదు. ప్రభుత్వానుమతిలేనందున పోలీసుపటేలు అమీనుసాహెబు రథము గుంజనివ్వలేదు. వైశ్యులలో కొందరు శ్రీవారిరథోత్సవము చూడవలెనని ఆశతోవచ్చి, వారుపడినపాట్లు తెలుపుచు "జాతరజరుగునని పత్రికలో ప్రకటింపించినవా డెవ్వడు" అని ప్రశ్నించిరి, దానికేమి జవాబు దొరకలేదు.

## ఖమ్మంమెట్టు గుమాస్తాలసంఘము

ఖమ్మంమెట్టులో గుమాస్తాల క్షేమమును కాపాడుముద్దేశ్యముతో ఒక గుమాస్తాలసంఘము ఏర్పాటుచేయబడినది. యం. అచ్యుతయ్యగారు అధ్యక్షులుగను, కె. వెంకయ్యగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి,

## తల్లి బిడ్డల హత్య

(స్వవి) మహబూబునగరం. తీరు ౯.

మాకురెండు మైళ్ళదూరములోవున్న పాలకొండలో నిన్నసాయంత్రము రెండుహత్యలు జరిగినవి. నేనుదయం నాగంటలకు శవములు తల్లి బిడ్డలవి ఆ కస్మాత్తుగ కనిపెట్టబడినవి. పిల్లనుచంపి కుప్పమీద, తల్లినిచంపి కల్లములో వేసినారట. నేనురేపు చాలాకాలమునుండి దారుణహత్యలుజరుగుచున్నవి. పోలీసులు ఒకనిపట్టినారు. అతడామె మరదియట.

## బీదరు

ప్రజలు ధనధాన్యములతో బీదరును వదలుచుండుట

బీదరు, తీరు ౧౮

బీదరుప్రజలు బీదరును వదలుచున్నవార్త నిజము కాని కొందరు యిందుకు యిష్టపడలేదు, ఇప్పటివరకు దాదాపు ౭౦౦ మంది గ్రామమును విడిచినారు. అక్కడి ముస్లింప్రజలతో తమ ధనప్రాణముల భద్రతవిషయమున అనుమానమున్నందున యిట్లుచేసినారని తెలియుచున్నది. కాని హిందుముస్లింలు యిచ్చిపుచ్చుకొను వ్యవహారములలో పూర్వమువలెనే కలిసిమెలసి వర్తించుచున్నారని తెలియుచున్నది.

స్థానమును విడుచుచున్న ప్రజలు ధాన్యమును గూడ తీసికొనిపోవుచున్నారు. ఇట్లు తీసికొనిపోవుచున్న సాహుకార్లు ౩౦౦ మంది యిందుకుగాను దరఖాస్తులు యిచ్చుకున్నటుల సంగతి తెలియుచున్నది. వారు యెడ్లబండ్లపైన లారీలపైన సంచులలో ధాన్యమునింపి పంపుచున్నారు. ఇదేకారణమున సరకులను రైళ్లనుండి మరియు యితరవాటిపైనుండి అమ్ముటకుగాను స్థలాంతరములకు కొనిపోవుచున్నారు గంజికొలి మాద్రవ్యము నష్టపోయినందుకే యిట్లు చేయుచున్నామని చెప్పుచున్నారు.

(అంజుమన్యాసు)

## మతశాఖ నాజింగారు

మతశాఖ నాజింఅగు అలియుద్దీన్ అహమ్మదుగారు తీరు ౧౦వతేది బుధవారమునాడు హాబీబునగరులో గోరస్తాన్ మసాకును, 'ఖుత్బియా' మదర్సాను, మదర్సా దీనియాతు'ను చూచిరి.

## రాయచూరు ఆబ్కారి మొహతెమీం

రాయచూరు ఆబ్కారి మొహతెమీంగాపనిచేయుచుండిన మీరుకాజింఅలీఖాన్‌గారి ఉద్యోగము ఖాయపరచబడినది.

## క్రొత్త అవధూత

(స్వ. వి) సదాశివపేట, మే ౧౯

పడమరనుండి ఇక్కడికి ఒక ౨౦, ౨౧ సంవత్సరముల వయస్సుగల నవయువకుడు వచ్చియున్నాడు. వానిదేహము రాగివర్ణముగలదై యున్నది ఇష్టమువచ్చినట్లు పలుకులు పలుకును. మెదడు సరిగాలేదు. ఇక్కడకొందరు హిందువులు వానిని నమ్ముచు అవధూతయని, సాధువని వానివెంబడించినారు. వానితో కొందరు మాకుపురుష సంతానముకలుగునా లేక స్త్రీ సంతానమా యని పరిపరి విధముల ప్రశ్నలువేతురు. అందుకువాడు కొందరికి అవునని కొందరికికాదని ఉత్తరమిచ్చును చెంబులో చేతులలో శ్రద్ధగల కొందరికి తీర్థమనిచెప్పి యేదో త్రాపుచున్నాడు. తానేవాడుకూడా మహాశ్రద్ధతోనె త్రాగుచున్నాడు. త్రాగి తీర్థవాసన వెండియున్నదని కుతూహల పడుచున్నారు.

## తారానగరం జాగీరు స్మారకసభ

తారానగరం, తీరు ౨౧

స్వర్గీయ. ధర్మదాత మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దరు అమీనుల్ సల్తనత్ గారి స్మారక సభజరగెను. ది ౧౬-మే ౧౯౪౦ తేదిన వీరి గౌరవార్థముగురించి దుకాణము లన్నియు మూసివేయబడెను. ఘ॥ కిషన్ప్రసాదు బహద్దరుగారు దేశసేవయొనర్చి లక్షలకొలది ధనము కొల్లబెట్టిన మహాత్యాగి. యిట్టి యుదారుని చరితమును సంస్మరించి, వారియాత్మకు శాంతి కలుగుటకు పరమేశ్వరుని ధ్యానించి వారికుటుంబమునకు సానుభూతి తెలిపిరి.

## తాజ్‌మహాల్ మరమ్మతు

ఆగ్రా, మే౧౫—

తాజ్‌మహాల్ నిర్మాణంలో ఏదైన లోపాలున్నవేమో, మరమ్మతులేమైన అవసరమేమో దర్యాప్తుచేయడానికిగాను యెత్తయిన పందిరి నిర్మించటాన్నిగురించి ఇంజనీరింగు పురాతత్వశాఖాధికారులు చర్చించిరి. ప్రస్తుతం పందిరి నిర్మించటానికి నిర్ణయించుకొన్నారు.



## ప.ఘ.వ. ప్రభుత్వగారు యుద్ధనిధికి పదరల ౫౦ వేల పౌనులనిచ్చుట

కిస్తా మార్చి ౧౪

శ్రీ ప్రభువుగారిదివరకే యుద్ధనిధికి చాలాసార్లు మిక్కిలి గొప్పమొత్తాలను యిచ్చినారు, యుద్ధవిమానదళానికి నిమిత్తము ౧ లక్షపౌనులనిచ్చినారు. దానితో దొరతనంవారు హైదరాబాదు విమానదళమును (స్క్వాడ్రను)యేర్పాటుచేసిరి ఈదళంవారిదివరకే చాలా శత్రువిమానాలను పడగొట్టినారు, హైదరాబాదు విమానదళంయొక్క ఖర్చులనిమిత్తం శ్రీనిజాంగారిప్పుడు మళ్ళి రాజప్రతినిధిద్వారా యుద్ధానికి ౫౦ వేల పౌనులనిచ్చిరి,



## నైజాము ప్రజలకు హెచ్చరిక

నైజామునకును, బ్రిటిషువారికును వీ.పి. పద్ధతిలేకపోవుటచే మా అనుభూతమందులన్ను యితరమందులను గ్రంథములను తెప్పించుకొనుటకు యిబ్బందిపడుచూ అనేకమంది కోరుటచే యీక్రిందివారిని నైజాములో మాస్టాకిస్టులుగా యేర్పాటుచేసితిమి కావున నైజాము ప్రజలకు యీవిషయము తెలియపర్చడ మయినది,

స్టాకిస్టులు:—మధిర డాక్టరు రామగోవిందం.

" ఖమ్మంమెట్టు:-బొమ్మిడి రామకృష్ణయ్య సన్సు.

" వరంగల్లు:-రవ్వాలింగయ్యగారు, లేక కుమారా ప్రింటింగ్ వర్క్సు.

" సికింద్రాబాదు:-మూల్‌చంద్ అండ్‌కో, స్టేషన్‌రోడ్.

" హైదరాబాదు:-కింగ్ అండ్‌కో.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

# సహాయ నిరాకరణము

## త్వరలో ఏదో నిశ్చయము

మహాత్ముని వ్యాసము

బొంబాయి, మేంగా —

సహాయనిరాకరణమును శిక్షకతో మహాత్ముడు ఈ తేప హారిజనపత్రికలో ఒక రాజకీయ మిత్రుడడిగిన ప్రశ్నకు సమాధానము వ్రాసెను అంగ్ల పక్షంవారు ధర్మపక్షంవారిమీద నుపయోగింపుటకుకూడ ఉపయోగపడు సత్యాగ్రహమును సాధనమును ప్రస్తుత విషమఘట్టములో ప్రయోగింపకుంటే శ్రేయస్కరము అని ఆ రాజకీయమిత్రుని సలహా. ఇందుకు మహాత్ముని ప్రత్యుత్తరము —

"సహాయ నిరాకరణమువల్ల కొన్ని సందర్భములలో కోరదగని ఫలితములు కలిగియుండవచ్చునుగాని అనేకసందర్భములలో వివేకముతో దానిని ఉపయోగించినపుడు చాలా అమోఘముగా పనిచేసినది కొట్టి మంచి చెడుగులు పరిశీలించి మంచిఎక్కువా చెడుగుఎక్కువాఅని నిర్ధారించుకొనినపిదపగాని ఒకదానివిలువను నిర్ణయించుటకూడదు. ఒక్క విషయము మాత్రము సత్యము. సహాయ నిరాకరణమును దుర్వినియోగపరచినచో అనుష్ఠులితములు దుర్వినియోగపరచిన ఆతనికే ఎక్కువగా బాధించునుగాని, ఎవరిమీద సత్యాగ్రహము ప్రయోగించెనో వారికికాదు

బ్రిటిషువారికి ఈసమయమున ఇబ్బంది కలిగించు ఉద్దేశ్య మింతమాత్రమునులేదు వారికిబ్బంది కలుగకుండ అనగా దేశములో హింసాపూరితము గుచర్యలు తలయెత్తుట కవకాశములేని విధముగ సత్యాగ్రహమును ప్రయోగించువిధము కనిపెట్టుటకు సర్వశక్తులు వినియోగించుచున్నాను

రరగమునదముకు సంసిద్ధత కాంగ్రెసువారిలో ఎక్కువగా కనుపట్టక పోయినను, కాంగ్రెసు కార్యక్రమమున కామోదము వారిలో హెచ్చుగా కనుపట్టుచున్నది, ప్రజలలో హింసాపూరితమగుచర్యలు కనబడియుండినచో నా ప్రయత్నమునకు విఘాతమేర్పడెడిది అహింసావాదులను ప్రోగుచేయుట కష్టమయ్యెడిది. కాని ప్రజలు కట్టుదిట్టములతో అహింస తప్పకుండ ప్రవర్తించటవల్ల భవిష్యత్తు నా కాశాజనకముగా కనబడుచున్నది.

హిందూముస్లింసఖ్యత చాలా ప్రధానమగు అంశము ఇప్పుడు సఖ్యత సమకుర్చుకొననిచో ముస్లిములకోరిక లింకను విపరీతముకావచ్చును, గనుక త్వరలో ఏదో ఒడంబడిక కుదుర్చుకొనవలెనని నామిత్రుడు హెచ్చరించుచున్నాడు ఈకారణము సరియైనదికాదు ముస్లిములు విపరీతమగు కోరికలను ఎవరినికోరదరని భయపడవలెను? ఇతర భారతీయులకువలె ఈభారతదేశము ముస్లిములకు తమసొంతదేశముకాదా? న్యాయమగుకోరికలనుకోరుట అంగీకరించుటద్వారా సఖ్యత ఏర్పడును గాని కోరికలను పెంచుటవల్లకాదు దేశమును హిందువులకు ముస్లిములకుమధ్య విభాగించవలెనను కోరికయూం౦గా నా ప్రయత్నములకు తాత్కాలికముగా ఆటంకమేర్పడినది దేశములో వివిధసంఘములు ముందుగా ఒకఒడంబడికకు వచ్చిన గాని బ్రిటిషువారు ఇండియాపట్లతాము నిర్వర్తింపవలసిన న్యాయమును నిర్వర్తించుటను వీలులేదనువాదమును నేనంగీకరింపజాలను భారతదేశమునకు స్వయంనిర్ణయాధికారమున్నదని వారంగీకరించువో, ఇప్పుడు వారు చూపగల్గుచున్న ఇబ్బందులు ఆటంకములు మాయమయ్యెయుండును మనమవలె మటుమాయము కాగలవు ప్రసంగమునకు చివరను ప్రతివ్యక్తికికూడ నిర్ణయస్వాతంత్ర్య మొసగుటే మాయుద్దేశ్యము ప్రజాప్రతినిధి పరిషత్తులో సమష్టికి వ్యష్టికి పరస్పర వైరుధ్యము గోచరింపదనియే మానమ్మకము ఒకవేళ అట్టిది గోచరించి భారతదేశ విభజనవిషయమై పట్టువలబయుందేనచో ఏమిజరుగును? భారతదేశమును రెండుగాగాని ఇంకా ఎక్కువ ఖండములుగాని విభజించి బ్రిటిషు పరిపాలననుండి బయటపడుటలేదా మన గోమునకు పోష్టాకునాను బ్రిటిషు పరిపాలనలోనుండుట లేదా అంతయుద్ధముకొనసాగును అంతేగాని కార్యసహితమగు ప్రస్తుత అనిశ్చయస్థితి ఎక్కువకాలముండదు హిందువులు, ముస్లిములు సమావేశమై సమస్యలను చర్చించుచో దేశహితమగు నిర్ణయమునకు రాగలవని నాకాశగలదు.

## మైసూరు మతకలహము

లీగు విచారణసంఘ మేర్పరుచుట

బెంగళూరు, మేంగా —

బెంగళూరుకు ౨౦౦మైళ్ల దూరమునవున్న హరిహరులో జరిగిన హిందూ మహమ్మదీయ కొట్లాటవిషయమై విచారించుటకు మైసూరుముస్లిం లీగువారు కమిటీ నేర్పాటుచేసిరి

## రాటము-సత్య అహింసలకు చిహ్నము

వ్యాసరచనకు బహుమానము

అఖిలభారత చరఖాసంఘము ఆంధ్రశాఖ కారకార్యదర్శులు డాక్టరు భోగరాజుపట్టాభిసీతారామయ్య పంతులుగారిట్లు వ్రాయుచున్నారు

"రాటము సత్యమునకు, అహింసకు చిహ్నము" అని మహాత్మాగాంధిగారు చెప్పుచుండిన సుప్రసిద్ధవాక్యమునకు వివరణగా సులభశైలిలో వ్యావహారిక తెలుగుభాషలో వ్రాయబడు ఉత్తమ వ్యాసమునకు రు౫౦/-ల బహుమాన మిచ్చుటకు మామిత్రులొకరు ఏర్పాటుచేసినారు

వ్యాసము ఈవాక్యార్థమును సంపూర్ణముగా సమర్థించునదిగా నుండవలెను మహాత్ముని యీ విచిత్రవాక్యమును పురస్కరించుకొని భారతదేశములో జాతీయోద్యమ మెట్లు నిర్వహింపబడుచున్నదో నైతిక ఆర్థిక, రాజకీయోద్యమములు భారతజాతీయతా పునర్నిర్మాణమునకు సమానముగ నెట్లు దోహదమగుచున్నవో వ్యాసములో విశదీకరింపవలెను

వ్యాసము పండితపామరులందరికి సుబోధకముగను ప్రయోజనకరముగను నుండవలెను కావున వ్యాసముయొక్క గుణాధిక్యమును నిర్ణయించుటలో స్వకల్పనా శక్తియు, రచనాసమగ్రతయు, వీనితోపాటు స్పష్టశైలియు విషయవిశదీకరణ సామర్థ్యమును పరిగణింపబడును

వ్యాసములను మాసుప్రతులు వ్రాసి దిగువ సంతకము చేసినవారికి ఆగష్టు నెల లోపుగా చేరునట్లు పంపవలెను

అ భా చ సంఘ ఆంధ్రశాఖవారు వ్యాసమును రాబోవు గాంధి జన్మదినోత్సవ జ్ఞాపకార్థము ప్రకటింతురు అది అప్పటినుండియు వారి సొత్తుగా నుండగలదు.

